చెప్పకుండా మహారథికులై యెల్లకాలం పెత్తనం చెలాయించిన శతవృద్ధ భీష్మ ద్రోణాదు లేమైనా కౌరవ వంశాన్ని కాపాడారేమో చెప్పండి.

## సోపానం 9 (పింగళి సూరన్న)

కవితావస్తు ప్రదర్శనం ప్రధాన లక్ష్యంలో పెట్టుకొని, నడుం గట్టుకొని ఈనాటి నవ్యసాహిత్య సామ్రాట్టుల్ని కవ్విస్తూ వెలమీదికి దిగిన నా కలానికి తగిన సమాధానం మరెవ్వాళ్ళైనా యివ్వవచ్చు.

అధునాతన భాషా పరిభుత్వాధికారుల్నే నేనడిగింది. మిగతా సాహిత్య సైన్యాధిపతుల్ని, నానావిధ గ్రంథనిర్మాతల్ని నేను లెఖ్ఖలో పెట్టుకోనే లేదు. వాళ్ళ బలాబలాలేవీ నా లెఖ్ఖ చేయలేవు. కోపుతిన్నటం పట్టు పట్టడం చేతకానివాళ్ళు ఎన్నికూతలు పెడుతున్నప్పటికీ ప్రయోజనం లేదు.

నాటురకాల ధోరణి మార్చుకొంటే కొన్నాళ్ళకి నా చూపులో పడతారు. అంతేగాని దాణా బుట్టలు పెద్దవి పెట్టుకొని కళ్ళు చెదిరేటట్లుగా బొమ్మలు

కొమరుం బ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్
సక్కఁగాఁ జాగి మిం
టి మొగంబై చనుదెంచు తీఁగఁ గనుఁగొంటే!
దివ్యమౌనీంద్ర! నా
కమృగీనేత్రలమీద కయ్యమునకుం
గాల్చాచులాఁ గొప్పెడిన్!
(కళాపూర్ణోదయంలోది)

కలభాషిణి తన చెలికత్తెలతో పంతాలాడుతూ పూల తీగెల తూగుటుయ్యాల లూగుతుంటే, నాక లోక సౌందర్యవంతురాండ్రపైఁ కయ్యానికి కాల్చాచు నట్లుగా వుందని నారద శిష్యుడైన మణికంధరుడికి తోచినట్లు పింగళి సూరన్న కలం చెప్పింది. ఇతని లేఖినికి అడ్డు వంచనివారూ లేరు. బుఱ్ఱ తిప్పనివారూ లేరు.

అధోముఖాన్ని పెడుతుంది. అసహ్యాన్ని అశ్లీలాన్ని అందిస్తుంది.

అంచేత వూపులో లేచిన కాళ్ళని, వూపుని యిట్లా తీసుకోకూడదు. అసలు స్వాభావ సౌందర్య కిరణాలు కవిత్వానికి ప్రాణాలు. యీసంగతి గుర్తించని యీ పింగళి సూరన్న కలంలోంచి నట్టి చాదస్త నర్తన తప్ప కవిత్వ మెక్కడా దిగలేదు. ఉయ్యాల వూపుల్ని నా కవితా చాతుర్యంతో చూపిస్తున్నా చూడండి.

తుల(దూగఁ దిగుచున్న నందనకళా
దోర్వీర్య సౌందర్య వ
స్తులతాతన్వుల నొక్కయూపున వనిఁ
దూనీగలఁ జేసి, వి
స్తుల గర్వాతిశయమ్ముతో మధుర తంతుల్
మీటి యీ గందుకో
యిల మా స్వర్గపు ప్రాణితోడినది గాదే
తూగుటుయ్యాలలఁ॥

(మనోహరంలోది

ఇట్లా కలం నడిస్తే కవిత్వం కనిపిస్తుంది. ఇది

సహజ సౌందర్యోపాసకుని సొమ్ముగాని, బీరువాలు తెరచి బిరుదులు పెట్టుకొన్నవారిది కాదు. ఈ సంగతి తెలియకుండా దేశాన్ చాదస్తపు ధోరణి కూరికూరి కావడి పెట్టె గ్రంథాలు మోసుకొస్తున్న వాళ్ళని కవులంటే సహించకుండా వుంటానా?

---

## సోపానం 10

(బమ్మెర పోతన)

కవితా సంస్థానం నాది. సాహిత్య సంస్థానం మీది. కవితారాజ్యం నా యేలుబడిలో నడవాలి. నేను కవితారాజ్య పట్టాభిషిక్తుణ్ణి కాకమునుపు, నా కవితా రాజ్యాన్ని సాహిత్యసామ్రాట్టు లంతా ముట్టడించి, నానావిధాలా చికాకుల బఱచి, చిక్కిరిబిక్కిరిచేసి అయోమయావస్థలోకి దించి, తామరాక్షసిని నలుమూలలా తాండవింపజేస్తూ, కదలకుండా మెదలకుండా గ్రుడ్డుతెమి గాండ్రిస్తుంటే నేనెట్లా చూచి సహించేది? అంచేత తీవ్ర రూపం ధరించాల్సి వచ్చింది.

నేను సాహిత్యసామ్రాట్టునని చెప్పించుకోవడం చెప్పుకోవడం, యెట్లా ధర్మంకాదో, అట్లాగే మీరు

సున్నం గానుగాడే వాళ్ళని, ఊలు అప్పాకన్నులు కొట్టే వాళ్ళని, సున్నానికి వాళ్ళని పెద్ద పెద్ద బొక్కెనలతో తేసి మోసుకొచ్చే వాళ్ళని, సుతా గంగా త్రాపీ పని చేసేవాళ్ళని కలిపి, యింజనీర్లందు యెంత సవ్యసాచులో, యీగా కనిపిస్తున్న నానారకాల నాహావ్య సంపన్నులిక్క కవిబ్రహ్మలంటేను, కవి నాట్య భావములంటూనూ, నా కంత నవ్వొస్తున్నది.

ఇది గ్రహించకుండా ఆగ్రహిస్తే మట్టుకు మీ లోంచి లోకానిక ఎంత ఐశ్వర్యం, యెటువంటి ధర్మ భిక్షా దిగుతుందోకని పెట్టె జగన్సాక్షి సిద్ధంగావున్నాడు.

ఇహ ఎత్తుపడ్డవాటికి ఏటేటా దానకళా ప్రపుష్టులు ఖర్చుపడి, కష్టపడి, చిట్టూ, తవుడూ ఎంత కలిపి పెడుతూన్నప్పటికీ పుర్రు పెడుతున్నేగాని, కవితా క్షీరాన్ని ప్రసాదించటం లేదు. ప్రసాదిస్తే మట్టుకు నోబెల్ప్రైజ్ ఇప్పిస్తా. ముందుకొచ్చి కవ్వించండి.

ఇటువంటి వాళ్ళంతా ప్రోగై, భక్తిలో మునిగిన పరమ భాగవతోత్తమున్ని గూడా తమకు తోడుగా వుండటానికి కవికింద కట్టేసుకొన్నారు. నిజంగా నేను

కవినే కాంబోలు ననురోని, గావా భ్రష్[illegible]గాండా వాళ్ పోష్టస్తు [illegible]ను.

పైగా తనకు తల్లిగా వున్న [illegible] పేర్లు పెట్టి, యెట్లా వోదారుస్తున్నా[illegible] [illegible]. కవిత్వానికి యిటువంటి దోషమాపాదించటం. [illegible] కవిత్వంకాదు. కీచకులవంటి వాళ్ళకి [illegible]. పైకి కనిపించని మారీచులవంటి వాళ్ళకి అమ్మటం [illegible]తమేనన్నమాట.

కాటుక కంటినీరు చనుకట్టుపయిం
బడ నేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలి
కోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను
నాకటికిం గొనిపోయి. యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ
త్రిశుద్ధిగ నమ్మ భారతీ॥—

(భాగవతంలోది)

ఓ మదంబ! ఓ హాటకగర్భురాణీ! ఓ కైటభ దైత్యమర్దనుని గాదిలికోడల! కాటుక పెట్టుకొన్న

కన్నీళ్ళు రెండుచళ్ళమీద పడేటట్టుగా ఎందుకేడుస్తావే? నా పొట్టకోసం నిన్ను దుష్టుల కంటగట్టను. త్రికరణశుద్ధిగా నమ్మమని ప్రతిమాలుతున్నాడు. ఏ కారణంచేత త్రికరణశుద్ధిగా లేక తనతల్లి కనపడ్డదో ఆలోచించండి.

ఇక్కడ కాటుక కంటినీళ్ళని కారుమేఘాలగా తీసుకొని, స్తనాల్ని పర్వతాలలాగా చూచుకొని వ్యంగ్యంగా కలం నడిచినప్పటికీ మెచ్చదగ్గదికాదు. ఎందుకంటే! సరస్వతిని మాత్రం దేవతగా సంబోధించి, తల్లి చళ్ళని వర్ణించడం ఏం ధర్మం? ఇట్లా అంటున్నది యీ భాగవతోత్తముని దూఱటంగాదు. ఇతణ్ణి పట్టుకొని కవిత్వ మిదిగో చూడమంటున్న మిగతా యీ పద్యాల బత్తుల్ని మందలించడం. దారిచూపించడం తప్ప మఱేం గాదు. నా కలంనుంచి యీ భాషాప్రపంచంలో నాల్గు సంఘాలుగా విభజింపబడ్డవారిలో యీపోతనామాత్యుడు మూడవ తరగతి వాడు. అనగా ఏసరాజన్నమాట. కష్టాలలోవున్న తల్లిని నాకలం యెట్లా ఓదారుస్తున్నదో చూడండి.

దేనికి తల్లి! నీ కడుపుతీపి గుఱించి
మఱింతగోల? నీ
కూనలు గండులై ముదముం
గూర్చెడి చక్కని పెద్దికొండలై
మానధనమ్ము నిల్పుకొని, మాతృ
ఋణమ్మును దీర్చుచున్నచో
ఈ నదియేటి దూకుము! మహీతల
మంతయు మ్రొగ్గిపోవగా ॥ ---

(భగవన్మత భాష్యం లోనిది.)

ఇట్లా వాదార్చాలి. కవిత్వ మిట్లా నసబర్చాలి. చివరికి వీడు భక్తులన్న భయంగూడా లేక, ఇట్లా లేచాడేమని అంతా అసహ్యాగించుకొని, జిల్లాయిలు పెట్టుకొని, నా చూపు తగిలినా మైలపడతామని భయం పెట్టుకొని, తొలిగి తొలిగి పోతారని బాగా తెలుసు.

బోదకాలు పుస్తకాలు వాళ్ళు నా పరు గందుకోలేరు.
మన దేశ భాషాసౌందర్య కిరణాల్ని
నానా దేశ భాషలలో తిరగబోస్తే
ఎంతనిగ్గు ఉందో తేలుతుంది.

---

## స్లో ప్రా సం 11 (శ్రీనాథుడు)

ఇంత సాహిత్యజనానికి పరవశత్వం పుట్టించ గల కవిపుంగవుడ్ని మాగా తెనుగు గడ్డమీద చూపిస్తే మెచ్చుకుంటాం. నెత్తి కెక్కించుకుంటాం. మన పురాతన పురాణ కాలం నుంచీ పరిశీలించి చూచినా, అంత జగద్విఖ్యాత కవిచక్రవర్తులు కనిపించటం లేదు. మనం మన పెద్ద వాళ్ళని యితర దేశాలకు గిరాటువేసి దివ్య కవితా మాహాత్మ్యం ప్రకటించుకొన్నప్పుడు చంకలు కొట్టుకోవాలి. వ్యాసుడు కాని వాణ్ణి సార్వభౌము డనరాదు. ఇది తెలియకుండా భుజాలెగిరేస్తూ బజార్లలో పొంగిపోయేవాళ్ళకు పేరిగాడికి ప్రతాపరుద్రుడి వేషం వేసినట్లుంది.

ఇప్పట్లో పిల్లుల్నీ, బల్లుల్నీ బెదరగొడుతున్న వాళ్ళని, సింహశార్దూల సంహార సాహస సార్వభౌముం డనటం మన తెనుగువాళ్ళకి బాగా పట్టుబడ్డది.

ఎవడిమాట సర్వసర్వంసహాస్థలి కెక్కి ప్రఖ్యాతి బొందుతుందో, వాణ్ణి కవిసార్వభౌము డనటం ధర్మం.

వచ్చారట. రాగా రాగా పనవాళ్ళ తరహాలన్నీ అట్లా వస్తున్నై.

ఇహ యీనాడు కవిసార్వభౌముణ్ణి కనిపెట్టగల దాతలూ లేరు. శ్రోతలూ లేరు. ఎంత బాగా గ్యాస్ కొడితే అంత భగ్గుమని వెలిగే పెట్రొమాక్సులైటువంటి వాళ్ళు నిలబెట్టిన కవిసార్వభౌముడి సత్తా చూడండి. వీని ఉత్తమమైన శృంగార నైషధ కావ్యం ఎంత శ్రావ్యమైన పాకాన బడ్డదో చూడండి. ఇతడు శ్రీనాథుడు. ఇంత గుణవంతమైన పేరుకలవాడు సార్వభౌముడై యెట్లా పరాధీనుడై శ్రీహర్షుడు రచించిన సంస్కృత శృంగార నైషధాన్ని తెనిగించాడోగాని, పండితపుష్టి భాషకి బాగా పట్టించాడు. వాపు బలమని భావించుకొంటున్న వెఱ్ఱివాళ్ళ ముఠాలోబడి భాషకి వాపు తెచ్చిపెట్టాడేగాని, ప్రపంచ ప్రాణమైన స్వభావ సౌందర్యాన్ని గుర్తించి కలాన్ని నడిపించలేక పోయినాడు. నడిపించగలవాడికి యీ చాదస్త ధోరణి తగదు. వ్యాతానికి వచ్చినవాడు, తన తాత ముత్తాతల సిరిగతులెత్తుకోడు. రోజువారీగా తాను తినే తిండిని

చెప్పుకోము. ఎక్కడెక్కడ తిరిగి చేసేదీ విప్పి చెప్పాం. పాడు వాగుడు పారపోయము. ఇన్ని అవలక్షణాల్ని దులుపుతున్న పద్యాన్ని చూస్తే తెలుసుంది.

నలినసంభవు వాహనము వారువంబులు
కులము సాములు మాకు కువలయాక్షి!
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు పుష్పబోఁడి!
సత్యలోకముదాఁక సకల లోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన!
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యులనుపమాంగి!
భారతీదేవి ముంజేతి పలుకు చిలుక
సమదగజయాన! సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
తరుణి! నీయాన ఘంటాపథంబు మాకు॥

(శృంగార నైషధంలోది)

ఆదినుంచి, కువలయాక్షనీ, పుష్పబోఁడినీ, అబ్జవదనయనీ, సంబోధించు కొస్తున్నప్పుడు, మళ్ళీ అనుపమాంగి యని వర్ణించడం అనవసరం. అసలు మాట్లాడు తున్నప్పుడు మాటమాటకీ ఇన్ని పర్యాయ పదాల్లో

సంబోధించటం చాదస్తమౌతుంది. అదీగాక తియ్యా తియ్యని మాటలు వింటానికి చెఱుకురసం త్రాగి రానక్కరలేదు. అయితే ఏకాంత ప్రదేశానికి తీసికొని పోయి నలచక్రవర్తి గుణాలు గొప్పతనాలు చెప్పాలి గాని యీ చాదస్తమైన వాగుడుతో గలభా చేయ గూడదు. క్రమవిరుద్ధంగాని పలుకుబడితో తమ గొప్ప తనాలమీద తమ ప్రభుని ప్రతిభాప్రభావాల్ని తేల్చాలి. కాని మజాకా నా కలం చూపిస్తున్నది చూడండి.

అవలీలగా మూఁడు భువనాలు దించేడి
మొనగాఁడు మేమన్న మ్రొక్కువాఁడు
పౌరుషంబుగఁ జక్రధారియై యేలెడి
కలవాఁడు మేమన్న తొలఁగువాఁడు
భీకరంబుగ సర్వలోకాలుఁ దుడిచేడి
ముక్కంటి మేమన్న నక్కువాఁడు
సుకుమారముగఁ జివ్వి చికిలి వవ్వాలికించు
మధురాజు మేమన్న మాటలాఁడు
కనుక; మేమింక నెవ్వాని కార్య శౌర్య
వీర్య సౌందర్య సద్గుణ ధుర్యులమయి
వచ్చినారమో కనిపించి ముచ్చటించి
వీదు తండ్రివి మెప్పించి పోదు మబలII

(మనోహరంలోది)

ఇంతకూ నే ననేదేమిటంటే ! జాగ్రత్తగా వినాలి.

మన వాళ్ళంతా ఎక్కా లొప్పచెప్పడంలో దక్షులేగాని లెక్క మట్టుకు చేయలేక పోతున్నారు. ఈ లెక్క చేయగలవాడి చేతిలోనే కవిత్వం కులుకుతుంది.

ఎక్కడో వొక్కవంక తీసి విమర్శిస్తేగాదని కవ్విస్తారేమో! భాండానికి వొక్క బెజ్జ మెక్కడపడినా చిల్లిదే అవుతుంది. పేరులో పూస వొక్కటి జారితే మిగతావిగూడా దానిమాదిరిగానే తయారు.

ఇట్లా విమర్శిస్తున్నది పోట్లాటగ్గాదు. మన పెద్ద వాళ్ళంతా సాహిత్యాన్ని కవిత్వంగా భ్రమించి పెడదారి బట్టారని చెబుతున్నా. ఇంత మాత్రానికి పెద్ద వాళ్ళని దూరుతున్నానని కారాలు మిరియాలు నూర వద్దు. మన పెద్దవాళ్ళంతా, ధర్మభిక్షకోసం భాషా భిక్షకోసం కలాన్ని అరగదీశారు. ఈ రెండు ధర్మాల్నే పాలించడం ప్రధానమనుకొని పాపం కవిత్వానికి వాచి పోయారు. ఇదీ తెలియనివాళ్ళు సాహిత్యంలోబడి వాచిపోయారు.

# సోపానం 12 (కవిబ్రహ్మ తిక్కన)

ఎవడిలో ఎక్కువ ఉక్కురోషం, అధికారం కరుడుగట్టుకపోయిందీ వాడి మొహం, వాడి అహం చెప్పనే చెబుతుంది. వీనిలో అధికార మోహం కణుపులుకట్టి మధుర మంజుల వాగ్విలాసాలు, మాయా వ్యూహాలు పన్నుతూంటై. మధ్యమధ్య ఈ మారీచుడు అనేక అనామక ప్రేత మొహాల్ని కదలించి, ప్రకటించి పట్టాభిషేకాలూ, కనకాభిషేకాలూ జరిపించి మిగతా అయోమయ, దౌర్భాగ్య జాతక పాతక పట్టాభి రాముళ్ళకి కళ్ళు కుట్టించి, భ్రమలు పుట్టించి పరిగెత్తిస్తుంటాడు.

ఇటువంటివాళ్ళు ఆడుతున్న కపట నాటకాల్ని ఇట్టా బైటపెడుతున్న నిరంకుశ విమర్శకాగ్రేసర చక్రవర్తిని ఏ పరిషత్సభా సమావేశాలకీ పిలవరు. పిలవక పోయినప్పటిగ్గూడా పిడుగల్లే నాడు దూకాడా, ఆనా డక్కడింకా యీ కుటిల గుణగణాలంకార దైత్య వల్లభుల మొహాలు కమిలి కుమిలిపోతై.

ఎందుకింత స్పర్ధా, దుగ్ధా పట్టి పళ్ళు పుళ్ళు పడేట్టు గన్నుకోని బాడితలు పెట్టి చెక్కుకోని బాధ పడుతున్నారో పిలిచి కనుక్కొనే దయారస హృదయు లింకా పుట్టలేదనుకుంటా.

అసలు నాధోరణి ఇనిఫెంటు క్లాసుకి, ఎలిఫెంటు క్లాసుకీ అర్థంకాదు. ఎవడు జ్ఞానానికి యూన్వ్యాస పుష్టి తెచ్చుకొంటాడో వాడు, జ్ఞాన సౌందర్య తేజస్సుతో నా ధోరణి తెలుసుకుంటాడు. బోసి నోటివాడు, చెరుకు గడల్ని తిడతాడు. బోడి తలవాడు దువ్వెనల్ని తగలపెడతాడు. అంచేత ఇటువంటి జాతివాళ్ళ మాట పెడచెవి పెట్టినప్పుడే నా మాట వినబడుతుంది. అంతే గాని, పళ్ళూడిపోయిన వాళ్ళ మధ్యా బట్టతలవాళ్ళ మధ్యా ఎంతెంత (Loud Speakers) లౌడ్ స్పీకర్స్ని పెట్టి నాచేత వాగించినప్పటికీ వినబడదు. పశువులు గాని, పక్షులుగాని, తమ గుంపులోకి క్రొత్త దాన్ని రానీయవు. వస్తే నిల్వనీయవు. వాళ్ళనీ - నన్నూ చూచి నప్పుడు యీ గమ్మత్తు కనపడుతుంది. పూర్వ ప్రపంచానికి పహారాకాస్తున్న ఉప్పుడుపిండి పతాలాలకీ, తొట్టి స్నానాల ముతాలకి నా మాట గిట్టదు.

ఇంకోమాట. "పూర్వసువాసినులలో రెండు రకాలుగా చీలి, కనిపిస్తున్నట్టు ఒకే భాషా ప్రపంచంలో పుట్టిన ఈ సాహిత్య పరిషత్సభా సభ్యులలో రెండు రకాలుగా చీలి కనిపిస్తున్నారు. సాహిత్య పరిషత్సభ వారొకరు-నవ్య సాహిత్య పరిషత్సభవారొకరు. ఒకరికి మడులెక్కువ - పొడలు తక్కువ. ఇంకొకరికి మడులు తక్కువ - పొడలెక్కువ, వీళ్ళంతా ఒక్కొక్క తిరణాలలో ప్రోగై పూర్వ భాషా దేవాలయాల చుట్టూ ప్రదక్షిణాలుచేసి ప్రాణాచారాలు పడుతుంటారు. ఎప్పుడైనా - నావంటివాడు మీద విరచుకొని పడేటప్పుడు వీళ్ళిద్దరూ చెట్టాపట్టాలు పట్టుకొని గ్రుడ్లురుముతారు. శృతి కలుపుకుంటారు. ఎన్నెన్నిచోట్ల వీళ్ళు బోల్తాలు కొట్టారో చూపిస్తుంటే, ఎబ్బెబ్బే అవి బోల్తాలుకావు సర్కస్ ఫీట్సని యీ ఇద్దరూ ఏకగ్రీవముగా రొకంటి పాట పాడుతున్నారు. అట్లా కూడపలుక్కుంటేగాని యీ కష్టకాలంలోంచి గట్టుసపడరు.

అయితే, వీళ్ళ గోళానికి కవి బ్రహ్మగారైన తిక్కన సోమయాజిగారు గూడా యీ గందరగోళంలో

పడ్డారు. వారుమట్టుకు కవితా వస్తువును గ్రహించారు గాని చిత్రించ లేకపోయినారు. మామూలు విషయాల్ని కూడా వ్యర్థపద భూయిష్ఠమయిన సమాసాలలో ఇరికించి వృత్తాలతో నడిపించడం సాగించారు. వ్యాస మహా భారత భారాన్ని చాలామోశారు. అసలు ఒకరి బరువు మోసేవాడి మొహంలో ఒకరి సొమ్ము ధరించేవాడి మొహంలో సంపూర్ణ వికాసం వుండదు. అయితే ఉత్తమ క్షాత్ర ధర్మాన్ని పాలిస్తున్న ఫల్గునుడి ప్రతాపాన్ని, పరాక్రమాన్ని వర్ణిస్తూ చాలా నీరసం చేసారు. అరణ్యవాసం వచ్చి పడ్డనాడు, అర్జునుడు అడవులలో దెబ్బతిన్న పులిగా తిరిగాడు. గాని పాంచాలి పోయి. అలోలక్షణా అంటూ ఎప్పుడూ ఏడవ లేదు.

శా॥ సింగం బాకటితో గుహాంతరమునన్
చేడ్పాటుమైనుండి. మా
తంగస్ఫూర్జిత యూధ దర్శన స
ముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాసఖిన్నమతి
నస్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీ సుత మధ్యముండు సమర
స్థేమాభిరామాకృతిన్॥ —

(భారతంలోనిది)

ఇక్కడ తిక్కన్న గారు బోల్తాకొట్టారు. "కాంతార నివాస ఖిన్నమనస్కత్వేనపై" దూకాడన్నారు. అయితే ఆఖరికి ఆకలైన పిల్లికూనకూడా ఏమూలా పడివుండదు. లేచిపోతుంది. అటువంటప్పుడు మృగరాజైన సింహం ఆకలితో చేడ్పాటుతో అన్నీ ఉడిగి గుహాలోబడి ఎట్లావుంటుంది ?

దేనికన్నా భయపడి ఎటూపోలేక పడివుందేమో నని తోస్తుంది. అట్లావున్న దానికి ఏనుగుల గుంపు ఎట్లా కనిపించి ఎగిరిపడుతుంది? ఉపమానం ఉదాహరణ సరియయిన తూకంలోనూ పాకంలోనూ పడలేదు. కనుకనే కవితా వస్తువు కాస్తగూడా కనిపించకుండా పోయింది. ఇక్కడ కవితాలేఖినీ చాతుర్యం చూపించ వల్సిన ఘట్టం అయోమయంలో పడి మట్టమయి పోయింది.

ఇహ దాని పోకు నా కలం చూపిస్తున్నది. చూడండి. మొహాలు చిట్లించు కుంటుంటే బాగా కన పడదు. జాగా తెలియదు.

కవితా సంస్థానము

మ॥ మది వేధించు మహాప్రతాపమున
బ్రహ్మాండంబు ఖండించి, దు
ర్మద ధారాధర గర్వ విస్ఫురణ
శౌర్యస్ఫూర్తి గర్జించి, యీ
పదరంగంబున సైన్యరాజి వణకించన్
వచ్చె, సామ్రాజ్య ది
వ్య దశాశ్వాసము వోయి, కాలపురు
షుండై పీడు నేఁడేమిటో!

(మనోహరం లోనిది)

అయితే ఇట్లా పెద్దవాళ్ళను పట్టుకొని తప్పులు పట్టటం, భావ్యంగాదని నాకు నీతులు చెబుతున్నారు. అట్లయితే వీళ్ళేమో పెద్దవాళ్ళు వ్రాసిన భారతాల్ని రామాయణాల్ని ప్రజల చేతుల్లోంచి లాగేసి వాళ్ళచేత తయారుగాబడిన భారతాల్ని రామాయణాల్ని బలవంతంగా తెచ్చి పడేయటం ధర్మమేనన్నమాట. నేనేమో పెద్దవాళ్ళ దోషాల్ని దులపటం కనబడుతున్నదిగాని అసలు వాళ్ళేమో పెద్దవాళ్ళని ఎంత చిన్న చూపు చూస్తున్నదీ ప్రజకు తెలియటం లేదు. పూర్వకాల భారత, భాగవత రామాయణాలు కమ్మని

శైలిలోవుంటే మధ్య మళ్ళీ వాటినే పిష్టా వ్రాయటంలో వున్న గీర్వాణమేమిటో నాకు తెలిసినట్లు ప్రజకు ఇంకా తెలియలేదు. పోనీ వాళ్ళంతకంటే గొప్పగా పేర్పించి చేర్చింది ఏముంద చెప్పండి? చాటు మాటున సాగడంలోకంటే ముందుకొచ్చి కవ్వించడంలో అతి మనోహరమైన ధర్మముంది. ధైర్య సాహసములుంటే ముందు కాగితంమీద కలంపెట్టి తరువాత బరిమీద కొచ్చి కూతపెట్టండి. సత్తా తెలుస్తుంది. నా విశ్వజన సహోదరులంతా సమన్వయ జ్ఞాన సౌందర్య పుష్టితో విచక్షణాదృష్టి తెచ్చుకొని నన్ను కనిపెట్టండి.

---

## స్లోహాసం 13 (రవీంద్రనాథ టాగూరు)

సుకుమార సాహిత్యానికి వొడిపట్టింది లోకం. ఇది రవీంద్రుడు కనిపెట్టి మనోహర భాషావనాల్లో చక్కచక్కని లలిత పదాలేరి తట్టకెత్తుకొన్నాడు కేకపెట్టాడు. నలువైపుల నాణెగాళ్ళూ తట్టదింపి చూచారు. మేలిసరుకు తళుకులూ, మెఱుగులూ కళ్ళు కుట్టించినై. ఇహ వెఱ్ఱిలోకం ఎగబడకేమౌతుంది.

పూర్వకాల వేదశాస్త్ర పురాణధోరణ్ని, తన సుందర సుకుమార సాహిత్య సౌందర్యవీధుల్లో కులికించి బాగా చెలామణీచేసుకొన్నాడు రవీంద్రుడు. అంతే పరాధీనుడై సహజ సౌందర్య ప్రకృతికానుపులన్నింటికీ ఉలిపిరి కాగితాలు చుట్టి, చక్కని న్యాసైపుతో మార్కెట్టుకి తీసుకొచ్చాడన్నమాట. దీనికి మార్కెట్టంతా విఱగబడింది. అంతేతప్ప అద్వితీయంగా, అపూర్వంగా ఏ పుస్తకంలో కవితా వస్తువును జూపించి విప్లవాన్ని లేపి, వినూత్న జగత్తును రవీంద్రుడు సృష్టించాడో చెప్పండి? అసమాన సమన్వయ జ్ఞాన సౌందర్య దృష్టితో స్రష్టకావాలి కవి.

అయితే రవీంద్రుడికి నోబెల్ ప్రైజు ప్రపంచం ఎందుకిప్పించిందని బోకరిస్తారేమో? లోకానికి వేదాంత పిచ్చ బాగాపట్టింది. ఇది రవీంద్రుడు బాగా తెల్సుకొని, సమస్త వేదాంతాల ఉచ్ఛిష్టాన్ని పిండి గీతాంజలిలో పోశాడు. ఈ గీతాంజలిలో వెఱ్ఱి వేదాంతుల గుచులన్నీ ఉండబట్టి నోబెల్ ప్రైజు వచ్చింది.

మన మహారాజశ్రీ చెప్పినట్లు సమస్త మానవ లోకానికి బ్రతికుండగా మహారాజరికం, మహారాజు

జీవనం సమానంగా కావాలిగాని వెఱ్ఱివేదాంతుల మెట్ట వేదాంతాలు బ్రహ్మశ్రీలు అక్ఖర్లేదు. ఈ వెఱ్ఱివేదాంతుల గీతాంజలి ధోరణి, నాటి మానవులమీద సవారీచేస్తున్న ధనికవర్గానికి సౌఖ్యమార్గం చూపిస్తుంది. అటువంటి ధనికవర్గమంతా మెచ్చుకొని రవీంద్రుడుకు నోబెల్ ప్రైజు ఇప్పించింది. అయితే రవీంద్రుడు రచించిన ఏ పుస్తకం, ఏ సూత్రం, ప్రపంచ ప్రజావిప్లవం తెచ్చి లోక కళ్యాణంకోసం నవరత్న తోరణాలు కట్టిందో చెప్పాలి? ఈ నిమిషంవఱకూ ఆ లెక్క ఎవ్వరూ చేయలేదు.

కోడికూత విని ప్రభాతలక్ష్మి వచ్చినట్లు, కోకిల కూత విని వసంతలక్ష్మి వచ్చినట్లు, రవీంద్రుని కూత విని ప్రపంచభవనాని కేమి వచ్చిపడ్డదో చెప్పండి? ఇదా గీతాంజలి వొక్కటి చూపిస్తారు.

అయితే, గీతలో ప్రభుత్వంవుంది. గీతాంజలిలో దాసత్వం వుంది. గీతలో వున్న ఫోర్సు అంజలిలో లేదు. ఈ నవయుగ ప్రజాశక్తికి కావల్సింది ప్రభుత్వం గాని దాసత్వంకాదు. అద్వైత సిద్ధాంతాన్ని ప్రసిద్ధిగా ప్రశంసించి విశ్లేసించే వాడెవడూ గీతాంజల్ని మెచ్చు

కోడు. ప్రతివాడికీ, గీతని నేనే చెప్పానన్న విశ్వాసం వుండాలి. అది అద్వైతమౌతుంది. ఎవడో కానరానివాడు గీత చెప్పాడన్న విశ్వాసం ద్వైతమౌతుంది. దాని కిహ రవీంద్రుడి మాదిరి దోసిలిపట్టే విశిష్టాద్వైత మౌతుంది.

అసలు, ఈ ఆధునికయుగంలో కావల్సినవి పాడు వేదాంతాలు కావు. శ్రుతి కల్పుకోవటాలు కావాలి. ఇది చాలా అసాధ్యమైన పని. హిందూ ముసల్మాన్ సోదరులు శ్రుతి కల్పుకొనే ట్లుగా రవీంద్రుడి కలం చేయలేకపోయింది. కాని మన తెలుగు దేశపు పల్లె దిక్కుల్లోనే హిందూ ముసల్మాన్ సోదరులు శ్రుతి కలిపి బంధురికపు బాటతో నడుగుతున్నారు. ఈగొప్పతనం మన తెలుగుకలం తెచ్చిందని విశ్వసించాలి.

ఒకే గొంతులో ఎన్ని శ్రుతులున్నయ్యో, ఎన్ని రాగాలొస్తున్నయ్యో అట్లాగే, వొక మహాకవి గొంతులో విశ్వజను లందరి శ్రుతులు వుండాలి. అంచేత మహాకవియైనవాడు విశ్వకల్యాణంకోసం, విశ్వజను

లందరి ప్రతికల్పనానికి, తగ్గ నాటకాలు, నవలలు వ్రాయాలి. అటువంటి గానాలాపన, నే మహాకవి మైనా చేస్తే ప్రపంచ శాంతి కనపడుతుంది.

రవీంద్రుడి హయాములో ఈ అవకాశం ఎందుకు వృథాగా పోయిందో గ్రహించండి. నాటకాలు నవలలు బోలెడు వ్రాసిన రవీంద్రుడి తపస్సు ఎందుకు ఫలించ లేదో ఊహించండి.

అసలు రవీంద్రుడి సత్తాంతా అరణ్యాల్లోంచి పర్వత శ్రేణుల్లోంచి, నదీనదాల్లోంచి, నీలిమేఘాల్లోంచి, నవపల్లవ పుష్పాల్లోంచి దిగి, వేదాంత సాహిత్యాన్ని ఇటువంటి ప్రకృతి సౌందర్యంలో పాదిగ మనోహర వేదాంత సాహిత్య చక్రవర్తిని చేసింది. సాహిత్యాన్ని చూచి కవిత్వంగా భావించి భ్రమించియున్న లోకానికి రవీంద్రుడు కవీంద్రుడేమో గాని నా ముందు కాడు.

ఈయుగానికి కావల్సింది నాటకము, నటుడు. నాటకాన్ని రచించి నటులను కదిలించిన కవిశేఖరుడు లేడు. రవీంద్రుడు కాడు. సాహసించి ఇంతమాట అన్నానని సున్నాలో తిరిగి గుడ్లుతిమితే యేం తెలుస్తుంది? అంత

మహాకవే వుంటే, దేశదేశాల నటుల్ని కనిటింది. అది యిల్లే. భారబ్బంతులు పెట్టుకొని నానావిచిత్రాల అగ్గి కలూ అల్లుకున్న ఆడపిల్లవలె, బహుభాషా సామ్రా పెట్టుకొని పనికిరాని పిట్టకథల్ని, మిట్ట వేదాంతాల్ని అందచందాలుగా అల్లి రవీంద్రుడు మల్లగా కాలాన్ని నెట్టుకుపోయాడు. ఇంతకూ ఇలాంటి శ్రమ సహమైనా వుపకరించేది వుందా?

ఇది తెలియకుండా ఎక్కడో చిన్న ప్రాంతీక బ్రహ్మరథం బట్టారని, ఇహ వూరూరా వెలిసిన సంఘాల బత్తులంతా బోయీలుగా తయారై వూరేగించారు. రవీంద్రుడి జ్ఞానధారాస్రవంతి, పచ్చి తిరనాలగుంపుకి పనికివచ్చిందిగాని దేశారాధకులైన కర్షక శ్రామికులకు పనికిరాలేదు.

ఎప్పుడూ మహాకవిచక్రవర్తి యుగాన్ని - జగాన్ని కళ్ళలో పెట్టుకొని, చిరకాలసిల్పాలో ముసు పెట్టుకొని సమస్తమైన ఐశ్వర్యాలు, అలంకారాలు ఇచ్చి శుభసుందర సుమనోభిరామ సీమలో ప్రతిష్ఠించాలి. భావి కాల భాగ్యోదయం చూపాలి.

అంతేగాని రవీంద్రుని కవిచక్రవర్తి అంటే నా కలం వప్పుకోదు. దాదాపు భవభూతి తరగలోవాడు రవీంద్రుడు. ఆంగ్లభాషాంతరాను చక్కదనాన్ని, ఐశ్వర్యాన్ని ముద్దుమూటలు గట్టించబట్టి ఖండఖండాంతరాలలో రవీంద్రుడి కీర్తిపతాకం లేచింది. ధనికవర్గ సాహిత్యంతో ధస్పళాలు సంపాదించాడు గాని ప్రజా సాహిత్యంతో విప్లవాలు లేపలేక పోయినాడు.

---

## సోపానం 14 (భక్తిరసంలో కవితావస్తువు)

కవిత్వానికీ, సాహిత్యానికీ బాంధవ్యం ఉన్నదని ఎంత వగా చేస్తున్నారో చూడండి కాస్త. సూర్యుడికీ చంద్రుడికీ ఎంత చుట్టరికం వున్నప్పటికీ, చంద్రుని కీర్తిని సూర్యుడు అపహరించటం లేదు. సూర్యుని కీర్తిని చంద్రుడు అపహరించటం లేదు. ఎవరి కీర్తికి వారు సంతృప్తిపడి కాలాన్ని గడుపుకొంటున్నారు. అట్లాకాకుండా ఇప్పుడు సాహిత్య సార్వభౌము లంతా తమకున్న కీర్తికి సంతృప్తిపడక, నిరంకుశ కవితా సామ్రాట్టు కీర్తిగ్గూడా పట్టుకు పాకులాడుతున్నారు. ఈ

మోసాన్ని తెలుసుకోకుండా వుంటేమట్టుకు, సాహిత్య
మేదో, కవిత్వ మేదో యేనాటికి తెలదు.

అయితే! మహాజనులారా! మీ చూపులో బడ్డ
సాహిత్యం యేంపని చేస్తున్నదో, కవిత్వం యేంపని
చేస్తున్నదో మీలో యెవరన్నా కనిపెట్టినట్టుంటే కవిత్వ
మేదో సాహిత్య మేదో తేలేది. సుకుమార జీవితాన్ని
చిచ్చికొట్టి జోలపాడి చక్కగా నిద్ర పుచ్చుతుంది
సాహిత్యం. సుకుమార ధనిక లోకానికి నిద్రపట్టించడా
చేస్తుంది కవిత్వం. మన జగత్తులో ఈ నిమిషంవరకు
కనిపిస్తున్న పుస్తకాలు సుకుమార శ్రీమంతుల్ని మెత్తు
కొని బుజ్జగించి వాళ్ళకోసం నానాపాట్లు పడుతున్నై.
మొక్కుబళ్ళు మొక్కుతున్నై.

ఏ పుస్తకాన్ని చూచినా మహారాజ జీవితాలు,
మహా ధనికవర్గ జీవితాలు శ్లాఘింపబడుతూ కనబడు
తున్నైగాని, కష్టజీవాల జీవితాలకోసం గోల పెట్టినట్లు
ఎక్కడా కనపడదు. ఏ గ్రంథంలో చూచినా నాయకీ
నాయకులుగా శ్రీమంత సుకుమారవంశాల్లోవాళ్లే కని
పిస్తారుగాని, యెండ కెండి, వానకి తడిసి, చలికి చిల్లులు

పడి, పెద్దలకి జడిసి, యెముకలు పగలుగొట్టుకొని యీ సమస్త జగత్తును మోస్తున్న కష్టజీవాలు మాత్రం కనిపించడం లేదు.

ఇంతకూ నావాదం జిన్నాగారి పాకీస్థానం వాదం మాదిరి కవితా సంస్థానంగూడా విడదీయాలంటుంది. ఆ జిన్నాగారి వాదం, యీ చిన్నాగారి వాదం ఫలించే వరకూ శాంతిసౌఖ్యాలుండవు. భక్తిరసాన్ని కవితావస్తువుతో యెట్లా చూపిస్తున్నానో నా కిరణాల్లో చూడండి.

వనవాసంబును జేసిరమ్మని మహా
బ్రహ్మాండ సామ్రాజ్య శా
సన సింహాసనలక్ష్మి యిచ్చిన యనుజ్ఞ
వేడ్క బాలించి వ
చ్చిన బృందారక చక్రవర్తివిర!
త్వచ్ఛృంగార శాఖా రమా
మణి నీడ న్మము విల్వనిమ్ము! రఘు
రామా భక్త కల్పద్రుమా॥—
(భగవన్మత భాష్యం లోది)

దీనిలో కవితావస్తు వుంది. అయితే ఎటువంటి కళాకాంతులతో వుందో దీన్ని కవ్వించి విమర్శించగల

మగవాళ్లు బయట పడితే తేల్తుంది. సత్తా ఉన్న వాడెవడో వచ్చి చూడండి. ఇహ కవితావస్తువు లేక పోయినా నిరర్థక పద గాంభీర్యంతో సాహిత్యాన్ని యిట్లా నడిపించి యిది నిఖార్సైన కవిత్వం అని కనకాభిషేకాలు జరిపించుకొంటున్నారు. దాని తరహా గూడా యిదిగో! ఇది మచ్చుకి నేనే వ్రాసింది.

శ్రీరఘువంశ వీరకుల శేఖర !
దివ్యకృపా సుధాకరా !
చారు వినీలమేఘ సురచంద్ర
కళాకమనీయ సాంద్ర ! నా
ఘోరములన్ని బాపి, కల కోరిక
లన్నియు లేపి, నీ సదా
చార సువర్ణపద్మ పద సన్నిధిఁ
జేర్పవె ! నాదు పెన్నిధీ !

ఇటువంటి ధోరణి దింపి. దుంప తెంపుతున్నారు! సువర్ణఘంటా కంకణ ధారణ చేస్తున్నారు. ఇహ ఈ రెండు పద్యాలు పుక్కిట బట్టించి భక్తిసుధారసం దేని లోనుంచి వస్తుందో మీరే కనిపెట్టండి. నిలబెట్టండి, గిల కొట్టండి.

నా నిరంకుశ కవితాలేఖినికి దాష్ట్యసంభావన పట్టిషం పనికిరాదు. గోదాలో దిగి పంజాదెబ్బ చూపించి పందెం కొట్టడం బహు ఇష్టమైనపని. శ్రుతపాండిత్యం చూపిస్తున్న మొహాల్ని నేనెప్పుడూ లెక్కలో పెట్టుకోను. అడుగుతున్న ప్రశ్నని అర్థం చేసుకోన్న ప్రజ్ఞావంతుల్ని నేనెప్పుడూ తృణీకరించి తోసివేయను.

సాహిత్యమంటే కవిత్వం, కవిత్వమంటే సాహిత్యం. ఈ రెండిటికీ యేమీ తేడా లేదంటున్న వాళ్ళ చెవిదగ్గఱ యెంత యేడ్చి మొత్తుకొన్నా ప్రయోజనం లేదు. పొడుం బాగా కూరుకొంటున్న ముక్కులకి ప్రతిదీ పొడుంకంపే కొడుతున్నందువల్ల విచక్షణావాసన లేకుండా పోయినట్లు ఎప్పుడూ సాహిత్యంలోబడి కొట్టుకుంటున్న వాళ్ళకి విచక్షణాశక్తిపోయి, కవితావస్తువును గుర్తించడం కష్టమైంది. చాటుమాటున సణాగీ, గొణాగీ సకిలిస్తున్న మొహం ఎదుటబడి యికిలిస్తుంటుంది. ఇటువంటి దృశ్యం నాకెంతో అసహ్యంవేస్తుంది. గుండె వుంటే గోదాలోకి దిగాలి; గుండెజారితే గోదావరిలోకి దిగాలి.

మనవాళ్ళు కవితావస్తువు గుర్తించినట్లయితే భక్తిరసం బహుబాగా పారేది. వట్టి జాబితాలు వ్రాసి స్తున్నమూలాన లోకం కవితాకళ మఱచిపోయి, గాన కళలో మునుగుతున్నది. ఇహ సంగీతం సాహిత్యం రెండూ కలిపి రుబ్బి రుబ్బి ఇదిగో ఇదే కవిత్వం అని నమ్మకం పుట్టించారు. ఈ వెఱ్ఱినమ్మకాన్ని పోగొట్టడం కోసమే ఇంత పట్టుదల పట్టాను. కవితావస్తువుతో భక్తి రసాన్ని యెట్లాపిండాలో నా కిరణాల్లో చూడండి.

ఎంతో కాలమునుంచి తీయని కళా
హేలా ప్రవాహమ్ములై
ఇంతెత్తైన హిమాలయమ్ములను నేఁ
దే మాడ్కిగా లేపి. పైఁ
గాంతారమ్ముల కెక్కు చుండినవొ నీ
గాథల్ జగన్నాథ! ని
శ్చింతన్ నా చెవికెక్కి వేమిటొ;
నిరీక్షింతుఙ్ పరీక్షించరా.

(భగవన్మత భాష్యంలోది)

కవితావస్తువుతో ఇట్లా భక్తిరసం దిగాలి. అంతే గాని చాదస్త ధోరణితో చాకలి పద్దులూ, కోమటి

పద్దులూ దింపితే కవితావస్తువు కాదు. భక్తిరసం రాదు. అసహనంతో మొహం చిట్లించుకుంటే కనపడదు. నిజమైన అపేక్షతో నిరీక్షిస్తే యోచిస్తే కనపడుతుంది. వాడి చెవి వీడూ, వీడి చెవి వాడూ కొరుక్కుంటే యేడ్పుగొట్టుతనం తప్ప మరేం కనపడదు. సమాధానం ఇవ్వటానికి సత్తావుంటే పాడుబోకరింపులు బోకరించకుండా నా మాదిరి కలం కాగితంమీద పెట్టి మీ మొహాలు చూపెట్టండి. ఎంత అందంగావున్నాయో చూస్తారు. ఇహ మీ సాహిత్య ధోరణిగూడా చూపిస్తుంటేగాని, పస యేంటోవుందో తేలదు.

ఓ కమలామనోహర ! మహోజ్జ్వల
దివ్యధరా పురందరా !
నీ కమనీయ దేహ రమణీయత
లెన్నఁగ నా తరంబ ! న
న్నీ కలుషాగ్నినుంచి కరుణించి
తరించు వరమ్ము లీయవే
నీకు సహస్ర సంస్తుతులు నిత్యము
సేతు దయాపయోనిధీ.

అయితే కవితావస్తువు పద్యంతోనే బిగించి చూపించక్కరలేదు. గద్యంతో కూడా చూపించవచ్చు.

గద్యపద్యాత్మకమైన నా నాటకాల్లో ఈ రెండువిధాల కవితావస్తువు చూపించాను. చక్కని విచక్షణా చక్షువుతో చూడాలి. గుడ్డిగూబ గోలతో తవడరాదు. నా కలానికి కులంతో నిమిత్తంలేదు. బలంతో నిమిత్తం వుంది. పేరుబడ్డ బలంగల వస్తాదులందర్నీ కదిలించాను. ఇంకా మారుమూలలను నాకు తెలియని విచక్షణాబల సామ్రాట్టులుంటే, వాళ్ళదగ్గఱకి మీరుపోయి నా మీదకిలోలండి. సంతోషిస్తాను. తడాకా చూపిస్తాను.

ఇన్నివిధాలా ఇటూ జన్మ క్షౌరకళ్యాణమై పోవటానికి ఇంత చిత్రవిచిత్ర నాటక నాటకరంగంమీద ఎంతో రాగసుధారసాన్ని కురిపించి మురిపించి పంపిస్తున్న యీ తెరచాటు సూత్రధారుణ్ణి గుఱించి కవితావస్తువుతో భక్తిరసాన్ని దింపి పలుకుతున్న నా కిరణాల్ని చూడండి.

ఎన్నో రోజులనుంచి నీవు పడు
    పాట్లెన్నో విలోకించి యీ
మిన్నేరుల్ ప్రవహించు కారడవిలో
    మెల్లంగ దాటించు వా॥

డెన్నో దెబ్బల కింత చిక్కినను, నీ
వేమాత్ర మీనాఁడు నీ
సన్నాహంబులతోడ చిక్కవు గదా
స్వామీ! ప్రసన్నుండవై.

అడుగుల్ బొబ్బలు పొక్కనేమొ! పను
నం బైనావు నా గోల కి
ప్పుడు; నీ కేమి యొసంగి తృప్తిఁ బఱతున్?
ముందింక ఈ మొద్దు బా

రెడు చర్మం బొలిపించి జోడు కడు
కూర్మిన్ నీవు కుట్టించుకో
పడియుందున్ నిరతమ్ము నీచరణ
సేవాదీక్షతో రక్షకా.

(భగవన్మత భాష్యం లోనిది.)

కవితావస్తువులో భక్తిరసం ఇట్లా వొలుకుతుంది. ఇటువంటి రసం వొలుకుతున్నప్పుడే ఱాలు కరిగేది. మోళ్ళు చివిర్చేది. ఇహ పద్యాలబత్తుల సాహిత్యధోరణికూడా చూపిస్తా.

గోపకులైక దివ్య నవ కోమల
మన్మధ చక్రవర్తి! సం
తాప కృపీటయోని మునిదారుణ
కారణ మధ్యవర్తి! ని

క్షేపములైన నీదు భుజకీర్తులతో
దయచేసి నా మన
స్తాపము దీర్పవే ప్రళయ సాగర
భీకర నన్ను గావవే.

దీనికి దేవుడు దిగిరావడ మెట్లావున్నా మేడ మిద్దెలమీదనుంచి ముక్కూ మొహం తెలియని మొన గాళ్ళంతా దిగివచ్చి కాళ్ళు కడుగుతున్నారు. కనకాభి షేకాలు చేస్తున్నారు. లోకాలు దోస్తున్నారు. ఇంత అమాయకత్వంలో బడి నన్ను నవ్విస్తున్నారు.



# సోపానం 15 (కథలో కవితావస్తువు)

ఇది సినిమా యుగం. తెల్లవారితే నిన్నటి సీనరీలన్నీ బూజుపడ్తై. కొత్తసీనరీలన్నీ మోజుపెడ్తై. ఇందువల్ల జగచ్ఛిల్పి రెప్పవాల్చటంలేదు. లెక్కలేని చిత్ర విచిత్ర కళాకాంతులతోనూ ప్రపంచాన్ని కులికిస్తున్నాడు.

ఇన్నిరకాల మార్పులతోనూ, కూర్పులతోనూ ఎన్నో కులుకుల్ని వొలికిస్తున్న ఇంత విశాల విశ్వాన్ని చూచేవాని చూపుకి ఊహాపోహాలు పుట్టి, ఉత్సాహ ప్రదేశాల్లో నానా కథల్ని అల్లుతై.

ఇవి పెద్దపందిళ్ళుగావున్న సంఘాలకి ప్రాకి కమ్మని పూలనీ, కాయల్నీ, చల్లని నీడల్నీ జాడల్నీ దింపుతై. ఇట్లా దిగిన సుకుమార సువర్ణ కుసుమ భావపరిమళాల కోసం, శుభమనోహర సుకుమార ప్రసన్న భావ ఫల రసాలకోసం పిల్లతెమ్మెరలూ గండుతుమ్మెదలూ షికార్లు కొడ్తై.

కొన్నిరకాల జీవితాలు కలిసి కథాకాపురాల్ని చేస్తై. ఈ కాపురాల్లో కలియక చెడినప్పుడు పతిత్ర

లోకానికి సౌఖ్యం ఉండదు. కనుక పాఠక గోళాన్ని గందరగోళంలో బడనీయకుండా కథ నడవాలి; కాసులు పడివాలి.

కథలు కేవలం నీతులకోసం ఐతైన జారి సుమతి శతకాల్లోనూ, వేమనశతకాల్లోనూ పడితే కథాశిల్పం చట్టుబండలౌతుంది. మనుస్మృతి పరాశరస్మృతులలో పడితే చాదస్తం సంపాదిస్తుంది.

అంచేత కథావాహినులు ఎత్తైన కొండలమీద నుంచి అడవుల్లోబడి, పీఠభూముల కెక్కి, నానారకాల పైరుల్ని పండిస్తూ పుణ్యతీర్థాలు కావాలి.

కాలచక్రాన్ని చూచుకోకుండా ధర్మచక్రాన్ని పట్టుకొంటే భీష్ముణ్ణి జయించలేరు.



శ్రీ యస్. దుర్గాప్రసాదరావుగారి కుమారుడైన

చి॥ నాగేశ్వరరావుని

చిన్ని శిష్యునిగా చేర్చుకొని

యిట్లా కవితావస్తువు వాడికి దిద్దపెట్టాను

కవితావస్తువు కావలసిన వారంతా

యీ చిన్నికూన దిద్దుకున్న వరవడి చూచి

దిద్దుకోవచ్చు.

---

# దేవీ స్తవము

గీ॥ రతనముల కన్న కనకదుర్గమ్మతల్లి
నీదు పిల్లల గోలకే నిలువలేక
కొండ ఎక్కి కూర్చున్నచో క్షోణిపైన
యింక మమ్ము కాపాడు వారెవరు గలరె? 1

గీ॥ ప్రేమతో అంత కటికదరిద్రుని కిల
ప్రేయసిగ నున్నదానవు ప్రీతితోడ
ఇంత కటికదరిద్రుని కెందు కింక
కన్నతల్లివి కాకుంటె కనక దుర్గ॥ 2

గీ॥ అనయమింక నీవన్న గిట్టని సవతిని
నాథుని తలపై కెక్కించినావు గాని
నీ కయి కలవరించెడి నీ తనయుల
ముద్దు చేయకుంటివి మల్లెపువ్వుతల్లి॥ 3

గీ॥ నీవు మృగరాజు నెక్కి రాణించుచుండి
యింత పుత్రుని ఎలుక నెక్కించినావు
కన్న కొడుకునే యీ మాడ్కి కాంచుచున్న
యింక మమ్మెట్లు చూతువో యీశురాణి॥ 4

గీ॥ సకల భువనాలు ముద్దు పెట్టుకొనుచున్న
చిన్ని రతనాలు. మరి నచ్చకున్న యింక
కుట్టెపురుగులు మెడచుట్టు పెట్టుకొనిన
చెవిటివాడు నీ కెట్లు నచ్చెనో మృడాని॥ 5

గీ॥ అంత శైలరాజ కుమారివైన నీవు
సకల సౌందర్య పుప్పొడోలికలు వదలి
యింత బైరాగివెంటఁ బోయినవు డింక
ఎట్లు తృప్తి పడుతు నిన్ను కోట్ల తల్లి॥ 6

గీ॥ వట్టి నిరుపేదవానిని చెట్టుబట్టి
యింత తిండిపోతుల నెట్లు సంతసముగ
పెంచుకొనుచున్న దానవో పృథ్వీపైన
చిత్రముగ నుండె నీదయ చిట్టితల్లి॥ 7

గీ॥ ఎట్టి కష్టము పడనట్టి పొట్టవాని
వట్టి తిండిపోతునిఁ జేసినట్టి నీవు
ఇంత కష్టము పడువాని కంత తిండి
ఇవ్వకుండెద వేమి మహేశు రాణి॥ 8

గీ॥ పట్టినకొలంది తిని పెద్ద పొట్ట పెంచి
యింక తినలేనివానికి యింక కూరి
యిట్లు కూడు గుడ్డయు లేక చెట్లక్రింద
మాడువారిని చూడవా నేడు తల్లి॥ 9

గీ॥ గంగ మ్రింగిన గాని మోక్షంబు లేదు
గంగ నీకు సవతి నీవు గంగ మ్రింగి
యింక మా కెట్లు పోతువో యింత గంగ
మేరు వెక్కిన చిన్ని బంగారు తల్లి॥ 10

గీ॥ ఎంతదయతోడ చనుదెంచి యీ జగాన
ఎన్ని చేలు పండించె నీ కన్నసవతి
సవతి గర్వమ్ము కుదిరించు సాక్షికైన
నన్ను కాపాడుకొనలేవ కన్నతల్లి॥ 11

గీ॥ ఎంతచక్కని చుక్కయై యింత సవతి
వెక్కిరించి నీపతినెత్తి కెక్కినదియొ
చూచుకొనలేని నీవు నే దాచు తప్పు
ఎట్లు కనిపెట్టెదవె అగచాట్ల తల్లి॥ 12

గీ॥ నీ సవతి నీవు కలవాని నెలవునుంచె
వచ్చినను నీ సవతిని నీ ప్రాణధనుడె
తల పయినఁ బెట్టుకొని నిన్ను తలచ నపుడు
నే నెటుల గొల్వగల్గుదు నిన్ను జనని॥ 13

గీ॥ నీ సవతి పంటలన్ని పండించబట్టి
అన్నసత్రాలు పెట్టి మే మున్న చోట్ల
అన్నపూర్ణమ్మ వని కొనియాడబడితి
లేక యీ పేరెటుల వచ్చు నీకు తల్లి॥ 14

గీ॥ బుఱ్ఱగల కుమారుని దానవుల పయినను
బొఱ్ఱగల కొడుకుని కుసుముల పయినను
యుద్ధమున కంపి సప్పుడు యుర్వి నన్ను
నేటిపయికి పంపెదవు కవ్వించి తల్లి॥ 15

గీ॥ ధరణి చల్లని తండ్రి సదనమునందు
పుట్టి పెఱిగిన దానవు ముద్దు లిచ్చి
కారుచిచ్చులు చిమ్ము ముక్కంటియింట
కాల మెట్లు గడుపుచుంటి కన్నతల్లి॥ 16

గీ॥ మీ రహస్యా లెవ్వరు వినలే రటంచు
పొంగుచుండిరి కాబోలు పుడమిపైన
అంత లోకోపకారు లైనట్టి వారు
నెత్తి కెక్కి వినిరి గాదె నేడు జనని॥ 17

గీ॥ చాల ఎక్కువైనట్టి మీ గోలతోడ
ఘోరమైనట్టి మీ యింటి గోలతోడ
వేగలేక కాబోలు మా పితరుడట్లు
సాహసించి విషము మ్రింగె శైలతనయ॥ 18

గీ॥ రవ్వవలె నున్న నీ కాపురమ్ము నిట్టు
గంగపాలు సేయుట కింతగంగ నకట
నీ మగని తలపై కెక్కనిచ్చినావు
యింక నిన్నెట్లు రానిత్తు రిపుడు తల్లి॥ 19

గీ॥ చదువు చట్టుబండలు లేని చవట నిట్లు
వట్టి తిండిపోతుని జేసి పశుల నెల్ల
విఘ్నములు చేయు విద్య నేర్పితివి కావె
యింక, మా కేమి నేర్పుదు విల భవాని॥ 20

గీ॥ పంట దేశాల కిచ్చి సర్వంసహా పయి
గడ్డి మేసెడి పశువును గౌరవించు
తండ్రికంటెను, నిన్నెట్లు ప్రార్థనము సేతు
మృగములను బలిపించెడి నగల తల్లి॥ 21



దీన్ని దేనికిచ్చానంటే తెలివి తేటల్లో దాక్కొన్న

అహంకారానికి

# అహంకారపూజ

( పెద్దచేతులకు దిద్దపెట్టిన కవితావస్తువు )

ఓరి లంబోదరుని తండ్రీ! ఓరి మొండి
గ్రుడ్లుతిమి పండ్లు కొరికి రక్కుకొన కోరి!
యెందు కిట్లుంటినో పరీక్షించుకోర!
పరువు నీ కెంత యున్నదో బయటపడుర!

ఒంటరివంటు నెంతొ చెమటోడ్చిన
కర్గని బండవంటు అ
న్నింటికిఁ దోడుగా గోడవి నిప్పులు
క్రక్కెడి యుక్కుబోతు ము
క్కంటివి యంటు! యిట్లలవిగాని
నినుఁ గని లెక్క సేయ కే
తుంటరి నైతిరా! ప్రళయ తోయధిలోఁ
బడఁద్రోతురా హరా!

జలగల్ చేపలు యింద్రకాయలు కదా
జన్మించె స్థానికిన్
తెలిసెన్ నీ బల వీర్య సంపదలు
ధాత్రిన్ రామలింగేశ్వరా!

తాలాంత్రాగ్రిగ జూతువేమి? జడ
లట్టల్ గట్టి యూడల్ బలెన్
వ్రేలాడించెడి నీ మొగంబునకు
దేవీమాధురీ ప్రేమ గీ
తాలాప మ్మవగాహన మ్మగునటే
ఆ నెత్తిపై పిచ్చుకల్
సిల్లో చేగిన పిచ్చి కెట్లు నగెనో
లెక్కింపవా ధూర్జటీ!

పనిపాట్లెన్నడు లేని ఆ బసవుం
డేవాడన్ దటస్థించెనో
వినువీధిన్ బగిలించు రంకెలు వృథా
వేయించి యీ బక్కచి
క్కిన వానిన్ బెదరించి అక్కతన
కోర్కెల్ దీర కా వల్లకా
టిని బాలించుట కేగినావు గదరా
తీపిన్ త్రిశూలాయుధా!

డొక్కశుద్ధి లేక రొక్క మేమియు రాక
వల్లకాటి బతుకు తెల్లవార్చి
గోల లేపుకొనుచు కొఱవి దయ్యాలతో
మిడిసి పడుదు వేమి గడుసువాడ!

అలకతో కంటికి నలకలై కలకబెట్టి
జోడుపెళ్లాలు కన్నీళ్లు తోడునాఁడు
ఇంకొకరి మొగ మేన్ను నీ వెళ్లు విందు
పట్టబోకురా! వాఁ ద్రొక్కఁబడి మహేశ!

కాళ్లు గడచిన ముద్దుకి కాడెకట్టి
మూఁడు మొన లున్న ములుకోల మూఁపు కెత్తి
దున్నుకొని చల్లుకొని నాటుకొన్న దారవు
బిచ్చమెత్తుచున్నావేమి? వెఱ్ఱివాడ!

భువనము లన్ని కన్నములు పొడ్చి
కుదిల్చి మఱొక్క టెక్కుఁ డు
న్నవి సవరించు చిట్టెలుక నాఁటి
లగాయతు నేఁటిదాక అ
త్యవసరమైన నీ కుడుములయ్యెను
వ్రేఁకాసి జగాన నీదు గా
రవమును నిల్పెరా! పురహరా! యొటు
వంటి కుమారుఁ డుండెరా!

భోగకాసు లేమి ముట్ట నని బూడిద
స్పర్శముగా సమస్త వాం
ఛా గృహారాజ దేహాధిప సౌఖ్యము
లేగనిమాడ్కి రుద్ధి, నై
రాగిగఁ గేరి యెంత గిరిరాజ
సుమారిని లేవగొట్టి యీ
రాగుడుమూతనాటకము దాచ
జలంచి తపించితో మృడా !

సిరిజతాద్రి నెల్ల కమనీయ
సుఖాలకు ఖర్చుపెట్టి, నా
నా రథసమ్మోగాగల వినాయకు
లండజె లేవదీసి, యీ
కోరలులేని దేశమును గొట్టు
కొనుం డని వల్లకాటిసం
సారము నిర్వ్యాపారముగ, సాకెతివా
లయకాలపాలకా !

ఇదిరా? నీ రసికత్వసార ! నస
రా జెవ్వంపు నీ కళ్ళపో
విటి నీగుమ్మముఁ ద్రాక్షడింక, మృదు
వాణీగానమాధుర్య ది
వ్యదశానంతదిగంతసౌఖ్యబహు
బ్రహ్మానందసౌందర్య పు
ష్టిది ముద్దాడెడి చక్కనయ్యని
కిలాడీ యెట్లు హింసించితో !

ఊయెల లూగుచుఁ తోడిమలూపని :
కమ్మని పూలతోటలో
హాయిగ ప్రేమసౌరభ రహస్యము
లన్నియు విప్పుచున్న నా
కోయిలజంట నిఁ గని, రగుల్కొని
సుంచీన కంటిమంటచే
మాయముచేసిపోతివిర; మారణ
కారణ రాజశేఖరా !

ఈ హిమశైలపుత్రి, భువనైక
మనోజ్ఞ సువర్ణగాత్రియై
స్నేహలతాప్రఫుల్లసుమజీవ
పరిమళరాగమాధురీ
మోహము లేపి నీ సిరిని బూడిద
జేసియు, చిప్పయిచ్చి సం
దేహము బాపి పంపెనటె? దేవిడి
లేవిడి కాగ శంకరా !

తొలకరి కన్నెకై మెఱుపుదుస్తులతో
జనుదెంచి గొప్పలన్
పలికెడి మాన్యయంపరసభాస్థలి
పెల్లెడిభంగి యుత్కృ భూ
తల మికి క్రుంగగా ప్రళయతాండవ
మెందుకుఁ జేయుచుంటివి ! వె
న్నెల రతనాల కోయదొర ! నిన్నెవ
రైన పరాభవించిరా !

విఱిగి పడుచున్న కెఱటాలచఱపులు తీసి
జడలు విఱబోసికొని కాళిజవకోలంది
సంగమున నెంత నటరాజభంగిమంబు
దివ్యముగ జూపినావురా తెల్లని దొర !

మఱుగులుకట్టి దేవతల నోరులు
ఊరెడి కల్లుకుండ సం
బరముగ లేపి దాని రుచిపట్టి
మఱెప్పుడు నిన్నుదక్క నె
వ్వరి శిరసావహించనని వంగి
సలాములుగొట్టి భక్తి త
త్వరతను నెత్తికెత్తి తఱితక్కలు
నాడవె లోకపాలకా !

సుందరీ ముద్రాక్షరశాల, బెజవాడ.

| పేజి | పంక్తి | పొరబాట్లు | తిరుగుబాట్లు |
|---|---|---|---|
| 9 | 17 | నేనిల | నేను |
| ,, | 18 | నల్గురివేపువాడనిక్ పకీరును | వాడవాడలక్ |
| 31 | 9 | బడెనో | నదియొ |
| 35 | 2 | కనిపిస్తుంది | కనిపిస్తున్నది |
| 95 | 9 | లెవ్వరు | లెవరు |

[ఇంకా పొరబాట్లు చదువరులు దయతో అందిస్తే యీసారి ముద్రణలో వేయగలము.]

